# జన్మభూమి

## సంపూర్ణ - గ్రామీణ - పునర్వికాసం

కార్యాచరణ పథకం



ప్రజల వద్దకు పాలన
శ్రమదానోద్యమం
గ్రామస్థాయి - ప్రణాళిక

రచన

ప్రజాకవి

వంగపండు - అప్పలస్వామి

ప్రిన్సిపాల్ (Rtd )

పార్వతీపురం

విశాఖపట్నం ఉత్తరాంధ్ర

# అంకితం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధినేత
క్రియాశీల - ముఖ్యమంత్రి

## శ్రీ నారా చంద్ర బాబు నాయుడు గారికి

''ప్రజల వద్దకు పాలన''
ప్రగతి దాయక మనిపించిన ''పరిపాలనాయశస్వి''

శ్రమదానం''
ప్రజా ఉద్యమముగ నిలిపిన 'దీక్షా తపస్వి''

సూక్ష్మ స్థాయి ప్రణాళిక''
గ్రామ స్వరాజ్యభూమికను విజయ సాధన మనస్వి '

ఇట్లు
ప్రజాకవి - వంగపండు
(ప్రిన్సిపాల్ (Rtd)
పెందుర్తి
విశాఖపట్టణం - ఉత్తరాంధ్ర

స్థలం పెందుర్తి
తే 1-1-97

# సంపూర్ణ - గ్రామీణ - పునర్వికాసం

## కార్యాచరణ పథకం

స్వయం కృషి - స్వావలంభన - ఆర్థికవిధానం - అవసరం సమగ్ర భూసంస్కరణల చట్టం అమలు కావాలి ప్రొఫెషినల్ - టెక్నికల్ - కళాశాలలస్థాపన జరగాలి గృహపరిశ్రమలకు వృత్తి విద్యలకు ప్రోత్సాహంవ్వాలి శాస్త్రీయ సాంకేతిక విజ్ఞాన పాఠశాలల్ని తెరవాలి ప్రతి పల్లెలో **75%** రైతాంగానికి సొంత భూవములుండాలి పల్లెలో వ్యవసాయంపై ఆధారపడిన జనాభా **50%** మించరాదు పల్లెలు **50%** మించిన విద్యుత్‌జలాల వినియోగం పొందాలి పల్లెలో చేతినిండపని దొరకని వారి సంఖ్యను తేల్చాలి వృత్తి నైపుణ్యం సామర్థ్యం మేరకే అవకాశాల పంపిణీ జరగాలి

**శ్రమశక్తి** ' ఏ నిర్ణయం కొనుగోలు శక్తి సమంతరాకంగా నిలవాలి పరస్పర సహకారంతో వనరుల వినియోగం లోకి తేవాలి సాంప్రదాయక వృత్తులు - పునర్విజృంభించాలి గృహ పరిశ్రమలు - వర్ధిల్లిలి పరులపై ఆధారపడి జీవించిన వారి సంఖ్య తగ్గాలి అభివృద్ధి పథకాలు -జనసామాన్యులదరి జేరాలి లబ్ది దారుల ప్రయోజనాలు దళారీ వర్గానికి దక్కరాదు ఆర్థిక సంస్థలు బ్యాంకులు - అందని ద్రాక్ష పళ్లుగా మిగలరాదు ఋణమును సబ్సిడిగనే భావించే పరిస్థితి నుండి బయట పడాలి అనుచిత రాజకీయ జోక్యం పల్లెకు వినాశనకరం తేరగ వస్తే తిని తొంగో ఒచ్చు దామన్న భావం పోవాలి శ్రమే సంపదన్న మాట - వేద వాక్యం గానిలవాలి స్వయంకృషి పై జీవించాలి, ఆత్మ గౌరవం వికసించాలి

# తొలి పలుకు

ఎన్టీ ఆర్- ఆలోచనలు - ఆశయాలకు - ఆకర్షితుడనై 1992 లో పార్టీలో చేరి - అతని ఆదేశాను మతి మేరకు - ప్రజలిచ్చిన చార్జిషీటు డంకెల్ ఒప్పందం గ్రంథములను రచించి ప్రచురించితిని

అంతేగాక - సారా నిషేధోద్యమము బాగా బలపడాలని ఒక రచయితగా సారాభాగోతం అనురూపకమును వ్రాసి తనకే అంకితమిచ్చి ప్రచురించాను పార్టీకి సంబంధించి-గేయాల్ని-పద్యాల్ని కూడా రచించి ఎన్నో ప్రచురించితిని

సాహిత్యంద్వారా సమాజానికి సేవ చేస్తున్న నేను 1992 లో ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ పదవీ విరమణ అనంతరం- జనజాగృతికి సమాజ సంస్కరణకు నావంతు కృషిని నేను చేస్తూనే ఉన్నాను

అనివార్యమైన - అనూహ్యమైన కారణాలవలన టి డి పి ని విడిచిపెట్టి-బి జె పి లో చేరి పార్వతీపురం నియోజక వరంనుండి పోటీచేసాను తదుపరి బి జె పి నుండి కూడా రాజీనామా చేసాను రాజకీయాల్నే విడచి పెట్టాను

అయితే ప్రస్తుతం నేను ఏ పార్టీ వ్యక్తినికాను - ఏ పార్టీలోను లేను కేవలం నవ సమాజ నిర్మాణం కోసం అహర్నిశలు కృషి సల్పే- బహుగ్రంథ రచయితను - ప్రజాకవిని

జన్మభూమి ఉద్యమం ఎంతో ప్రశంసనీయం, ఒక కుగ్రామంలో ఒకనాడు జన్మించిన నేను త్రికరణశుద్ధిగా ఇందులో పాల్గొనాలన్న నా ఆలోచనలకు ఆశయాలకు ప్రతిరూపమే నాయీ రచన - జన్మభూమి - సంపూర్ణ గ్రామీణ వికాసం- కార్యాచరణ పథకం

**తేది 1-1-1997**
**స్థలం పార్వతీపురం**

**సదామీసేవాభిలాషి**
**ప్రజాకవి -వంగపండు- అప్పలస్వామి**
**పార్వతీపురం**

# జన్మభూమి

# సంపూర్ణ - గ్రామీణ - పునర్వికాసం

# సిద్ధాంత పత్రం

ఇందులో

16 సమిష్ఠ జీవితానికి ప్రతీక - పల్లె ప్రజల జీవన విధానం

17 గ్రామీణ - మహిళా సంక్షేమం

18 అధోజగత్ సోదరులకు రక్షిత పథకాలు (Protocted Scheme)

19 వెనుకబడిన తరగతులకు సంక్షేమ పథకాలు (Welfare Scheme)

20 బలహీన వర్గాలకు - సేవా పథకాలు (Service Scheme)

21 అల్ప సంఖ్యాకులహక్కుల రక్షణ

22 ప్రజాప్రతినిధులు ప్రభుత్వోద్యోగులు

23 ఉత్పత్తి శక్తి యజమాన్యపు శక్తి సమన్వయం శాంతి

24 అనిశ్చితాదాయాల వరాల సాంఘిక భద్రత

25 జనతా-పెన్షన్ విధానం

26 సామాజిక సామూహిక మరుగుదొడ్ల నిర్మాణం

27 ప్రజల వద్దకు పాలన - గ్రామ స్వరాజ్య సాధన

28 ముఖ్యమంత్రి యువశక్తి ఉపాధి హామీ పథకం

29 గ్రామీణగృహ పరిశ్రమలు సాంప్రదాయక వృత్తులు

# పల్లెప్రగతికి - జన్మభూమి పధకం

అర్ధశతాబ్దం స్వదేశపరిపాలనలో-పల్లెభారతిని అర్ధవంతముగా తీర్చిదిద్దుకోలేకపోయాం పల్లెల గత 50 ఏండ్లకాలములో రాజధాని గద్దెలపై కూర్చొని ఆదేశాలివ్వడమే తప్ప పల్లెలోగల పరిమిత వనరుల్ని ఉపయోగకరంగా వినియోగించుకోలేకపోయాం

భారీస్థాయి ప్రణాళికలను పరచు భ్రాంతివ్యామోహంలోపడి ఇంతకాలం డబ్బారథర్ముల్ని-ఆశించిన ఫలితాలనిచ్చాయా అప్పుల్ని భరిస్తూవచ్చాం- ఒకవైపు తెల్ల ఏనుగుల్ని మేపుతూ మరొకవైపు కాంట్రాక్టర్ల మాయాజాలంలో పడిపోయాం మధ్యదళారి వ్యవస్థను ప్రోత్సహించాం

నేడు నవతరం క్రియాశీలయువ ముఖ్యమంత్రి పల్లె భారతిని తీర్చి దిద్దగల ఒక నూతన పథకమునకు రూపకల్పన చేస్తున్నారు జన్మభూమి సంపూర్ణ గ్రామీణవికాసం కార్యాచరణ పథకమును అమలుపరుస్తున్నారు

నేటి పల్లెలే ఉత్పత్తి శక్తులకు యాజమాన్యపు శక్తులకూ కేంద్రమని పల్లెను ఒక ముఖ్యమైన పరిపాలనా విధానముగ రూపొందిస్తున్నారు సమగ్ర గ్రామీణాభివృద్ధి పల్లెప్రజల భాగస్వామ్యం వినా సాధించబడదని తెలిసికొన్నారు

ముఖ్యమంత్రి పదవి- అన్నది ప్రభుత్వ ఫైల్సపై దస్కత్ నిడటమే కాదని- నిరంతరం అహర్నిశలు శ్రమించి కృషి సలపనిదే రాష్ట్రాభ్యుదయానికి రాచబాట ఏర్పడదని మన రాష్ట్ర ముఖ్యమంత్రి ఉమ్మడి సంపద పెంపుదలకు ఊపిరిలివ్వ ప్రకటించిన పల్లెభారతి ప్రగతికి ప్రతిజ్ఞ

1 ప్రజల వద్దకు పాలన గ్రామస్వరాజ్యసాధన

2 శ్రమదానోద్యమం - శ్రమైక జీవన సౌభాగ్యం

3 గ్రామస్థాయి సూక్ష్మప్రణాళికలు పల్లెప్రగతి నివేదికలు

**మానసిక బలహీనత మంచిదికాదు**

**క్షుద్రం - హృదయ - దౌర్బల్యం'**

**(భ గీ 2 3)**

# స్వయంకృషి-స్వావలంబన పల్లెకు శ్రీరామరక్ష

అశాంతి-అభద్రత-నుండి పల్లెలు తేరుకొని - శాంతియుత-సుస్థిర జీవనం కొనసాగించాలి- ఆనాడే అభివృద్ధికి అంకురార్పణగ మహోన్నతకే -మార్గగామిగా పల్లెనిలుస్తుంది

దురాచారం-దురాపేక్ష-దురాశ-పల్లెప్రజలలో అసహనం- అరాచకం సృష్టిస్తాయి- ఆచారం- ఆపేక్ష- ఆశ-మనిషిని రక్షిస్తాయి దోపిడి-పీడనలకు చోటివ్వని గ్రామీణ ఆర్థిక వ్యవస్థను నిర్మించాలి సంఘవిద్రోహ శక్తుల్ని-పసిగట్టి ప్రాప్తించిన విజ్ఞానాన్ని పల్లె ప్రజలకు అందించాలి

వృత్తినైపుణ్యం ఉన్నవారికి గృహపరిశ్రమలను స్థాపించాలి - ప్రతిభసామర్థ్యాలున్నవారి స్వయంపోషక పథకాల్ని అమలుపరచాలి- గ్రామీణ యువజన బృందాల్ని ముందుకు నడిపించి- ఉమ్మడి సంపదను సౌభాగ్యం పెంచుకొనేలాచూడాలి-గ్రామస్థాయిలో-జరిగిన- ఉమ్మడి పనుల్ని-వారే నిర్వహించుకొనేలా చూడాలి

ప్రతి పల్లెకు ఒకపాఠశాల- ఒక ఆసుపత్రి- ఒక సహకారసంఘం- ఒక యువజన మందిరం - ఒక పంచాయితి ఒక గ్రంథాలయం - ఒకప్రార్థనా మందిరం- ఒక మహిళా సంఘం-గ్రామస్వారాజ్య సాధనగా నిలవాలి- ప్రజాస్వామ్య జీవిక-దీపిక పల్లెపరిపాలన-వేదిక

నిరంకుశపద్ధతులు దోపిడీ విధానాలు-మానభంగాలు - కిడ్నాప్‌లు గృహదహనాలు-లాకప్-మరణాలు హత్యలు -తగ్గించడమే కాదు ఏవీలేకుండా చేయాలి- ఇదంతా రాజకీయ అధికారంగాక-ప్రజాభీష్టం -రాజీలేని పోరాటాన్ని అహర్నిశలు జరపాలి

ఆనాడే-శాంతిభద్రతల స్థాపన జరిగి-అభ్యుదయము అభివృద్ధి శాంతి వెల్లివిరుస్తుంది గ్రామీణ జనజీవితానికి సుఖమయము జీవితం లభిస్తుంది సామాజిక ప్రయోజనాలు నిత్యంసిద్ధిస్తాయి

''సంశయించకు పతికిలపడతావు

'' సంశయాత్మా -వినశ్యతి

(భ గీ 4 41)

# అదుపు- ఆజ్ఞలు-లోకువ-లొంగుబాటులు

శారీరక కృషికి మేధోపరమైన జ్ఞానం తోడైతేనే ఫలితం వస్తుంది
కృషితోనే మానవుడు మనిషి అవుతాడు ఒకటి శ్రమరూపం వేరొకటి శక్తి
స్వరూపం- వ్యక్తి స్వేచ్ఛ సమిష్టి ప్రయోజనానికి మార్గదర్శకాలు

వస్తువులోగల ప్రతిభాసామర్థ్యం అభివృద్ధిని శాసించె ఉత్పాదక
శక్తులు అయితే వ్యక్తులలో గల అవివేక బలహీనతలు సమాజ పరివర్తనకు
అడ్డు తగులుతూ ఉంటాయి అదుపు- ఆజ్ఞలు-ప్రతిభ సామర్థ్యాలున్న
చోటనే ఉంటాయి అవివేకబలహీనతలున్నచోట-లోకువ లొంగుబాటు
లుంటాయి దోపిడీ పీడనలు ఇందువలననే జరుగుతాయి

అందుకు ప్రతిభ-సామర్థ్యంలు - ల ఒకరిసొత్తుగా నిలవవని - ఏ
ఒకరు ఎల్లకాలం అవివేకం బలహీనులుగా నిలవరని- ఇదే సామాజికపరిణామ
పరివర్తమని తెలియజెప్పాలి ప్రతిభాసామర్థ్యాలు అందరికీ పట్టుపడినట్లుగా
అవివేక బలహీనతలు సమాజమున అంతరించేటట్లుగా ప్రజలలో శాస్త్రీయ
అవగాహనాశక్తిని పెంపొందించాలి

సమాజమున అభివృద్ధి అనేది పోటీస్పర్థలవలన తప్పసంఘర్షణ
పోరాటం వలన సాధ్యపడదని గ్రామీణ ప్రజలెల్లరికి తెలియజెప్పాలి
కృషి(కర్మ) వినాజ్ఞానం(ఆలోచన) జ్ఞానంవినా కృషి-రూపందాల్చవు
ఇందులో శ్రామికులు కష్టజీవులు అల్పులని-మేధో పరమైనజ్ఞానం కలవారు
పెద్దలని భావించడం పొరపాటు శ్రమైక జీవనసౌందర్యానికి సమానమైనది
లేనేలేదని గ్రామీణ భారతి తెలుసుకోవాలి అవివేక-బలహీనతలు ఎచటునున్న
వాటితోపోరాడాలి అంతం చేయాలి ప్రతిభాసామర్థ్యాల్ని ఉన్నచోట వారిని
గౌరవించి ఆదరించాలి పలువురుమెచ్చిన ప్రజాస్వామ్యపరిపాలన
నవసమాజస్థాపన సిద్ధించాలన్న శారీరక కృషికి మేధోపరమైనజ్ఞానానికి
రెండింటికి సరిసమాన ప్రాతినిధ్యమిచ్చి గౌరవించాలి

**కృషి(కర్మ) మేధస్సు(జ్ఞానం)విడినడవు '**
**వ్యవసాయాత్మిక బుద్ధి**

**(భ గీ 2 41)**

# పల్లెలే - దేశానికి - పట్టుకొమ్మలు

అసంఘటిత అసంఖ్యాక బడుగు బలహీన ప్రజానీకానికినిలయం మన పల్లె భారతి-రాష్ట్రంలో దాదాపు 60వేల గ్రామాలున్నాయి 32వేల పంచాయితీలున్నాయి 11వేల మండలప్రజాపరిషత్తులున్నాయి

శ్రమశక్తికేంద్రాలు మనగ్రామాలు-పల్లెలేఉత్పత్తిశక్తులమూలకారకాలు అన్ని వనరులకు మూలభీజం భూమి అటువంటి భూమి నేడు పల్లెల్లోనే వస్తూత్పత్తి సేవలకు సృష్టికర్తగా ఉంది

మన రాష్ట్రంలో వ్యవసాయమే జీవనాధారం-రెండవస్థానం పరిశ్రమలది మనరాష్ట్రంలో 78% ప్రజల గ్రామీణులు ఈ భూమిపై నిల దొక్కుకొన్నవారిని మనంరైతాంగం-లని రైతుకూలీలని పిలుస్తున్నాం

భూసంస్కరణల అమలులో-భూకామందులు-భూస్వాములు అంతరించి-నేడున్నదీ వ్యవసాయరంగంలో రైతు రైతుకూలిలే సన్న చిన్నకారు రైతాంగం-అని-ధనిక-మధ్య తరగతి రైతాంగం అని పిలవబడుతున్నారు

రైతు-రైతకూలీ- ఐకమత్యంగా నిలచినగాని-అధికాహారోత్పత్తి-సేవలు సాధ్యంకావు-అల్పాదాయ స్వల్పాదాయ వర్గంగా నిలచిన రైతుకూలీలు బ్రతుకుల్లో జీవన చిరుదివ్వెల్ని వెలిగించి జనసేవ పధకాల్ని విస్తరింపజేయాలి

గ్రామంలో వీరితో పాటు శ్రమకు గిరాకీలేని-అనిశ్చిత-అల్పాదాయ వర్గాలు వెట్టిచాకిరి దార్లు-గ్రామ పాలికాపులు-చిన్ని వృత్తి గృహ పరిశ్రమ దార్లు కూలీనాలీ దొరకని నిర్భాగ్యులు పారిశ్రామిక విప్లవంతో సన్నగిల్లిన కుమ్మరి వడ్రంగి నేతపనివాళ్ళు వీరి ఆర్ధికస్థితి మెరుగు పడనిదే రాష్ట్ర ఆర్ధిక స్థితి బాగుపడదు కొనుగోలు శక్తిని కోల్పోయిన పల్లె ప్రజలు జాతీయ సంపద పెంపుదలలో భాగస్వామ్యులుగా నిలవలేరు

పల్లెల్లో ఏ ఒకరు వేరొకరికి అడుగులకు మడుగులు ఎత్తే పరిస్థితిని నిర్మూలించాలి ఎల్లరికి స్వతంత్ర్య జీవనం కల్పించాలి పల్లెలే దేశానికి పట్టు కొమ్మలనిపించాలి అందుకు వీరిని ఆదుకోవాలి

దున్నే వానిదె - సాగుహక్కు

పట్టా ఉన్నవానిదే భూమి హక్కు

# బ్రతుకులు కూర్చని బడులెందుకు తిండి పెట్టని చదువులెందుకు

విద్య దేశములోని వస్తూత్పత్తిని పెంచటానికి- కొత్తవనరుల్ని అన్వేషించడానికి ఉపయోగపడేదిగా ఉండాలి పనికి- మనసుకు సంబంధం ఉండి తీరాలి ఎ ఒక్కరికైనా నిజమైన ఆనందం- పైసలు వచ్చే ఉద్యోగము వలన కాక- మనసుకు నచ్చే వృత్తి చేయడంవలన వస్తుంది

విజ్ఞానం వివేకం విస్తరిల్లటానికి విద్య ఉనికి- మనుగడ- వికాసనల నందినవారికిది అన్వయిస్తుంది ఎంత చదువు చదివి - ఏమి బోధించిన ఏమి ఇచ్చెదరన్న- ఏవగింపు మిగులుతుంది తను ఉనికి మనుగడ వికాసనలను అందాలి వ్యక్తి తన వృత్తిని పొంద గలగాలి ఇందుకు కృషి-నైపుణ్యం విస్తరిల్లిన- వృత్తి విధానంలో తను ఉత్తీర్ణుడు కావాలి

కాయకర్మ (శ్రామి) హీనమని వాచిక కర్మ (ఖలుకు) గొప్పదని భావించరాదు ఒక వృత్తి గౌరవమైనదని మరొకటి అగౌరమిచ్చేదని భావించడం కేవలం అజ్ఞానం- మూఢ విశ్వాసం

తన జీవన మనుగడకుపకరించే దేమైన అదితన వృత్తి సే నిలుస్తుంది బ్రతుకుల్ని బాగు చేయగల బడుల్ని స్థాపించాలి తిండి పెట్టగల వృత్తుల్ని ఏర్పరచాలి మన విద్యా విధానం- మన సాంప్రదాయం మన సంస్కృతిని మన ధర్మమును పోషించేదిగా ఉండాలి చదువును కొనజూచే అధికాదాయ వర్గాలవారిని నివారించాలి చదువు కొనదలచిన వారిని ప్రోత్సహించాలి కేవలం విద్యాలయాలలో మెరిట్- రిజర్వేషన్లు ప్రకారం తప్ప మరే విధంగా ప్రవేశం కల్పించరాదు

సమాజమున ప్రతి ఒక్కరికి సాధారణ విద్యను కల్పించాలి ఉన్నత విద్యను పొందనుత్సాహ పడిన అర్హులైన వారికి బడుగు బలహీనులకు- ఉపకారవేతనాల నందించాలి అధికాదాయ వర్గాల వారికి ఉన్నత విద్యలో ప్రోత్సాహించే పథకాల్ని రద్దు పరచాలి గ్రామీణులెల్లరికి సాధారణ విద్యను కల్పించాలి

వృత్తి నైపుణ్యం- లోక జ్ఞానం పాటవము సంపాదించి పెట్టగల వృత్తి విద్యా శిక్షణ కళాశాలల్ని తెరవాలి నిర్బంధ ప్రాథమిక విద్యా విదానమును అమలు పరచాలి నిరక్షరాస్యులు- వలన ఉత్పత్తి సాధన ఫలం పరిమితం అక్షర జ్ఞానుల వృత్తి సాధనవలన- ఫలితం- అపరిమితం

**' శ్రద్ధగలిగిన వారికి జ్ఞానం- చక్కగ అబ్బుతుంది'**

**శ్రద్ధవాంల్లభతే జ్ఞానం''**

**(భ గీ 14 39)**

# వస్తు-సేవల సృష్టికర్త-శ్రామికుడే

ఒకనాడు గ్రామీణులు వారి మనుగడ మేరకే ఉత్పత్తుల్ని సాధించేవారు నేడు-అధిక ద్రవ్యాపేక్ష సాధనకు వారి ఉత్పత్తులు నిలుస్తాయి ప్రతి గ్రామం తన కందిన-అందగల భౌతిక వనరుల్ని వినియోగించుకొని తెచ్చుకొని స్వీయ అవసరాల్ని ప్రయోజనాల్ని తీర్చుకోవాలి

గ్రామాల్లో గల ముడి సరకులు ఇతర ప్రాంతాలకు తరలి వెళ్ళి మరల వినిమయవస్తువులుగా గ్రామాల్లో ప్రవేశిస్తాయి అవివేకం వలన మధ్య దళారీల వలన వారి వస్తూత్పత్తుంకు సేవలకు వారు తగిన గిట్టుబాటు ధరల్ని పొందలేరు కనీస మద్దతు ధరల్ని అందరేరు అందుకే- అమ్మబోతే అడవి-కొనబోతే కొరివి అన్న సామెత లేచింది

తన ఆహార జీవన స్థితి గతుల మేరకే ఉత్పత్తులన్నది పోయి నేడు మానవ వ్యక్తిత్వ వికాసానికి-అభ్యుదయానికి సాంకేతాలుగా ఉత్పత్తులు నేడు నిలుస్తాయి వ్యక్తుల సంపదే-మన రాష్ట్ర సంపద-వ్యక్తుల జీవన ప్రమాణం పెరగనిదే రాష్ట్ర ఆర్థిక స్థితి గతులు బాగుపడవు

ప్రతి ఒక గ్రామం-తన యావత్ శ్రమ శక్తిని-కూడబల్కుకొని స్థానికంగా లభించిన వనరుల్ని-చిన్న పెద్ద తరహా పరిశ్రమలద్వారా వినిమయ సంపదలగా మార్చుకోవాలి అందుకు బ్యాంకింగ్-ప్రభుత్వం నుండి తగిన ఆర్థిక సహాయం పొందగలగాలి

నేడు ప్రతి ఒక గ్రామంలోనికి విద్యుత్-రవాణా-వార్తా ప్రసార సౌకర్యాు అందుబాటులోనికి వచ్చాయి భారీస్థాయిలో అప్పులు చేసి భారీ యంత్రాలతో పరిశ్రమల్ని గాక-చిన్న తరహా పరిశ్రమల్ని స్థాపన చేయాలి ఉత్పత్తి ధరలనుగాక నామ మాత్రపు మిగుల విలువల్ని రాబట్టుకోవచ్చు-ప్రతికార్మికునికి-కష్టజీవికి ఇందులో భాగస్వామ్యం కలుగుతుంది ఇచట కార్మికుల్ని యజమానులు దోచుకోవడమనేది ఉండదు పెట్టు బడులు వారివే (బ్యాంకింగ్ ప్రభుత్వం) శ్రమ శక్తి వారిదే

**పనికి-తగిన వేతనం-కృషికి తగిన ఫలితం**

**కృషి చేసిన వానికే - కూడు గుడ్డ వసతి**

## ప్రజాపంపిణీ వ్యవస్థ-మార్కెట్ ఎకనమీ-సమతూకం కావాలి

పల్లె భారతిలో ప్రజాపంపిణీ వ్యవస్థ లేనిచో పల్లె ప్రజలు మరీ దుర్దశకు చేరుకుంటారు ఆహార వాణిజ్య పంటలు సమృద్ధిగా ఉన్న-వీటికి మద్దతు ధరఉండక-గిట్టుబాటు ధర పలకదు ఇవే మరల వినియోగ రూపంలో వచ్చినపుడు మార్కెట్‌లో కొనుగోలు శక్తి ఉన్న వారె తప్ప శ్రమకు తగిన ఫలిత వేతనం పొందలేక పోతున్న రైతులు రైతుకూలీలు సామాన్య ప్రజానీకం జీవాన వరాలు తగిన స్థాయిలో అందవేదు

అందుకు ప్రభుత్వం సబ్సిడి రేట్లపై వినిమయ వస్తూత్పత్తుల్ని బలహీన వర్గాల వారికి ప డి యస్ ద్వారా పంపిణీ చేస్తున్నది స్వేచ్ఛా వాణిజ్యంలో (Market Economy) కొనుగోలు శక్తి ఉన్నవారు లేనివారు-కే వస్తువును ఒకే రేటుకు కొనవలసి వస్తుంది అల్పస్వల్పాదాయవర్గాలవారు-అధికాదాయ వర్గాల వారితో మార్కెట్ పోటీకి నిలవ లేరు ఇందుకు ప్రత్యామ్నాయమే ప్రజా పంపిణీ వ్యవస్థ వ్యావసాయిక ముడి సరకుల్ని మధ్యదళారీల బారి పడకుండ చూడాలి కాస్త పసుకు బడి ఉన్న-ఏ మాత్రం చేతిలో పైసలున్న మధ్యదళారీగ అవతరిస్తాడు

నిస్సహాయ నిర్భాగ్యులకు ధరలపై కల్పించే ఈ సబ్సిడీ ఎర్పాటు వారి గ్రహపాటును తప్పించే ఒక ఊరాహగ నేటికి నిలుస్తున్నది నిత్యావసర వస్తువుల్ని కనీస జీవనస్థాయిని నిలపటానికి ఈ వ్యవస్థ ఉపయోగపడుతున్నది

ఇందుకు ప్రభుత్వం గ్రామాల్లో గల ప్రజలను స్వల్పాదాయ అధికాదాయ వర్గాలుగా విభజిస్తూ- ఈ నిత్యావసర వస్తువుల్ని ఆ గ్రామ డిపోలో అందటానికి తగిన అధికార పత్రాల్ని అందిస్తుంది వీటిని రేషన్ కార్డులంటారు అసమానతలు బాగా చోటు చేసుకున్న గ్రామీణ ప్రజల్లో అధికులు అక్రమంగా- ఈ సదుపాయాల్ని అవకాశాల్ని అందటానికి అడ్డుదారుల్లో ప్రయత్నిస్తారు దీనిని వారించాలి

**మధ్యదళారీ దోపిడీని మట్టుపెట్టాలి**

**మద్దతు ధర-గిట్టు బాటు ధరలుండాలి'**

# చిన్న నీటి వనరులే-పల్లెలకు సిపలనిస్తాయి

అన్నదాత సుఖీభవ అధికోత్పత్తి భరోభవ కేవలం- ఆశీర్వచనాల వలన ఇది సాధ్యపడదు. నీటికోసం రైతన్న నింగిని చూసే హీన దీన పరిస్థితి పోవాలి

అదృష్టవశాత్ ఆంధ్ర ప్రదేశ్ జలవనరుల గల రాష్ట్రం. తూర్పు కనుమలలో నిత్య వాగులు గెడ్డలు సెలయేర్లు ప్రవహిస్తూనే ఉంటాయి. ఇప్పటికే మన ప్రభుత్వం చాలా ప్రాంతాల్లో చెరువుల్ని గెడ్డల్ని వాగుల్ని విని యోగించుకునే చిన్న నీటి పారుదల పథకాల్ని రూపొందించింది

భారీ మధ్యతరహా నీటిపారుదల సౌకర్యాలు-పెద్దపెద్ద బహుళార్ధక సాధక ప్రాజెక్టులు-అసంపూర్తిగా ఉన్నాయి. నేటికి పూర్తి చేసుకో లేక పోతున్నాం. శ్రమ-సమయం-పెట్టుబడి వృధా అవుతున్నాయి. చేతికి అందలేదు. ఉపయోగ రహితాలుగా ఉన్నాయి. భారీగా అప్పులు తెచ్చి వాటిని పూర్తి చెయాలి

ఇందుకు గ్రామ స్థాయిలో లభించగల నీటి వనరుల్ని సద్వినియోగం లోనికి తెచ్చుకొనే ప్రణాళికల్ని రూపొందించుకోవాలి. చేతిలోనున్న ఒక పక్షి పొదలోనున్న రెండు పక్షులకు మించినదిగా ఉంటుంది. ప్రక్కనే ఉన్న సెలయేరు వాగును గెడ్డను భారీనీటి చెరువును-విస్మరించి వాటిని వినియోగించటానికి తెచ్చుకొనే ఆలోచనకి స్వస్తి చెప్పి ఏదో ఒక పెద్ద నీటి ప్రాజెక్టు పూర్తి అయిన వస్తుందని సంవత్సరాలతరబడి ఎదురు చూడటం అవివేకం

ఒరిస్సా సరిహద్దులో - అటవీ ప్రాంతాన - చిన్న నీటివనరుల్ని సమృద్ధిగ - గలిగిన మేము 20 ఏండ్ల నుండి ఈ నాటికి పూర్తి కాని జంఝావతి కోసం దిక్కులు చూస్తూ బ్రతుకుతున్నాం. సాంప్రదాయక వాగులు చెరువులు గెడ్డలు మనకు ఎంతయిన ఉపకరిస్తాయి. ఇందు వలన మనం బెటర్‌మెంట్ టాక్సుల్ని రైతాంగం చెల్లించనవసరం లేదు

**నీటి పారుదల శాఖను - లాభసాటి శాఖగా మార్చాలి**

**నీటి పన్ను చెల్లించిన రైతుకు - కోటి పంటలు పండాలి**

# శ్రమదానం-ప్రజలదే ఇందులో ప్రధాన స్థానం

ప్రజల వద్దకు పాలన అనే మహత్తర బృహత్తరపథకమును-ప్రభుత్వం- అమలు పరుస్తున్నది ఇది విజయవంతం కావాలన్న మారుమూల నున్న పల్లెకు సవాతం-రవాణా వార్తా-ప్రసార సౌకర్యాలు ఏర్పడాలి

దారి డొంకలు లేని ఊళ్లన్న మన పల్లె కొంపలు దమ్మిడికి పనికి రావన్న- అన్నది జనశ్రుతి దీనికి పూర్వపక్షం వేసేలా మనం గట్టి కృషి సలప ఇందుకు నడుం బిగించాలి తత్ఫలితమే శ్రమదానం పథకం

ప్రతి ఒక చోటకు ప్రయాణ సౌకర్యం ఏర్పడితేనె ప్రతి పల్లె బస్ సౌకర్యం ఎర్పడుతుంది పంచాయితీ రాజ్ రహదార్లు ప్రభుత్వ రహదార్లు ఎన్ని ఏర్పడిన పల్లె ఈ విషయంలో ఇంకను ముళ్ల పొదలోనె ఉంది

రాష్ట్రంలో గల ఏమూల నుండైన ప్రతిపౌరుడు రాష్ట్ర రాజధానికి వచ్చి పోయేలా - గొలుసు కట్టు రోడ్లను పల్లె ప్రాంతాల్లో ప్రభుత్వం ఏర్పరుస్తూనే ఉంది అయితే ఇందుకు అమితంగా రాష్ట్ర బడెట్ ఖర్చు అవుతున్న అందుతున్న రవాణా సౌకర్యాలు అంతంత మాత్రమే అందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం- ఒక వినూత్న పద్ధతిని దరిపిలా ప్రవేశపెట్టింది ప్రజల సహకారంతో శ్రమ దానంతో రోడ్లను నిర్మించడం-బాట్లను వేయించడం- గ్రామిణ రహదార్లను ఎర్పరచడం- ఒక ఉద్యమంగా ప్రవేశ పెట్టింది

నిజానికి రహదార్ల నిర్మాణం ధనశక్తిపై గాక శ్రమశక్తి పై ఎర్పడతాయి పల్లె భారతిలో మానవ శ్రమ శక్తి (Man Power) కి కొదవలేదు - కనీసం పక్కా రోడ్లు మెటల్ రోడ్లు నిర్మాణానికి నాందీగా-రహదార్ల నిర్మాణం ప్రజాసహకారంతో భాగస్వామ్యంలో నిర్మించాలి

శ్రమదానోద్యమం వలన ప్రభుత్వ నిధుల వినియోగం తగ్గడమే గాక పనికి పది రూపాయిలకి-ప్రభుత్వం పదివందలు ఖర్చు పెట్టాలన్న దుష్ట సాంప్రదాయం పోతుంది

**నీ వంతు బాధ్యతను తప్పక నీవు నిర్వర్తించాలి**

**సతతం - కార్యంకర్మ - సమాచర**

(భ గ 3-14)

# ప్రజారోగ్యమే- ప్రగతికి మార్గదర్శకం

మనది జనసంక్షేమ రాజ్యం- జనాలకు ఉచితవైద్య సదుపాయాన్ని కల్పిస్తుంది అన్న తృప్తిని నిర్వహిస్తుంది వ్యక్తులను సంబంధించినంత వరకు వైద్యసదుపాయాలుంటాయి మొత్తం సమాజం ఆరోగ్యకరంగా మెలగడానికి ఎన్నో పారిశుద్ధ్య కార్యక్రమాల్ని ఆరోగ్యకరమైన పరిస్థితుల్ని కల్పిస్తుంది ఇందుకు ప్రత్యేకమైనశాఖల్ని ఏర్పరుస్తుంది

గ్రామీణ పారిశుద్ధ్యం అనేది పెద్దొక గడ్డు సమస్యగా మారింది అవిద్య అజ్ఞానం అమాయకత- గుడ్డినమ్మకం- అంధవిశ్వాసం పెల్లుబికుతున్న- గ్రామీణ వాతావరణములో పారిశుద్ధ్యం అనేది దుర్లభమే అయిన ఉమ్మడి ప్రయోజనాన్ని విస్మరించదేం- ప్రభుత్వం ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల్ని కొన్ని వాటినే తెరిచింది అన్నట్లు కొన్ని గ్రామాల్లోనే ఉంటాయి వైద్యాధికారులు ప్రతి గ్రామాలో ప్రజలు ఆరోగ్యంకాపాడే విధానాన్ని అమలుపరుస్తుంటారు

గ్రామీణులకు విహారస్థానమై ప్రదేశాలే తప్ప ఏ ఒకరు మరుగు దొడ్లను కలిగి ఉండరు ఉన్నను వినియోగించుకోరు- మలవిసర్జన నివాస స్థలాలకు అతిదగ్గరలోనె జరుపుతారు

తాగేనీటిని కూడ పరిశీలించరు గంగకు ఎంచితే గతులుండవురా- అని అంటారు ఈ తాగేనీరు ఆ మల విసర్జనే వారి రోగాలకు కారణమన్న- నమ్మకంతో ఉండరు పరిసరాలను శుభ్రపరచుకోవడం ఒక పనిగా గుర్తించరు చుట్టుపక్కలనున్న చెత్తాచెదారం మురికినీరు- చెడుగాలిని- వారేమి పట్టించుకోరు ఇందువలన రాగల ప్రమాదాన్ని వీరు గుర్తుపట్టలేరు

అందుకు కారణం- శాస్త్రీయ విజ్ఞానం వారిలో లోపించడమే కలరా మశూచి కుష్టు వగైరా రోగాలకు కారణం అమ్మవారని నేటికి ఎన్నో గ్రామాలలో గ్రామదేవత- పండుగల్ని జరుపుకొంటారు

వ్యక్తిగత పరిశుభ్రతను- పాటించనేపాటించరు ఒకమారు వేసుకొన్న బట్టలు అవి ఎంత మాసిపోయిన- అందువలన నష్టమేమింటారు అనారోగ్యమె ఆయుక్షీణమని గ్రహించరు

**ఆరోగ్యమైన - చోటనే మనవుండాలి**
**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మన**

**(భగ -6 12)**

# సాంప్రదాయకవృత్తులే - పల్లెలజీవనావృత్తులు

పల్లెల్లో 75% మంది సాంప్రదాయక వ్యవసాయక వృత్తిలోనె జీవిస్తున్నారు- గృహ పరి శమచే ఒకనాడు గ్రామమును స్వయంపోషక కేంద్రాలుగానిలిపాయి స్వయం పూర్ణతను గామాలు కలిగిఉండెవని గతచరిత్ర చెప్తుంది

విద్యుఛ్ఛక్తి వినియోగంలోనికి రావడమే తరువాయి వస్త్రోత్పత్తులో మార్పులు వచ్చాయి చేతి పరి శమలు సతికలపడ్డాయి చెరువులనుండి నూతుల నుండి- నీటిని శమశక్తి ద్వారా పొలాల్లోనింపే పర్స్థితి పోయి- విద్యుత్ మోటార్లు వలన నీటి సరఫరా జరుగుతున్నది

ఒకనాడు కేవలం శారీరక శమతో పండించిన పంటల్ని నేడు యంత్రసామాగ్రిని వినియోగిస్తూ వస్త్రోత్పత్తుల్ని సాధిస్తున్నారు గృహంలో దీపపు ప్రమిదల స్థానములో విద్యుత్ బల్బులు వచ్చాయి

అయితే ఈ లఘు గృహ పరిశ్రమలను సాం పదాయక వృత్తులకు విద్యుత్‌ను సబ్సిడి రేట్లుపై విద్యుత్‌ను సరఫరా చేస్తేనేతప్ప వినియోగించు కోలేని హీనదీన పరిస్థితి పల్లెల్లో ఉంది ఆర్థికంగా బలపడనివారిని సబ్సిడీను రేట్లను వ్యవసాయ పంపునీళ్ళను కరెంటుకివ్వాలి లఘుగృహపరిశ్రమలకు విద్యుత్‌సరఫరా చేయాలి

అధునాతమైన పరికరాల్ని సమకూర్చుకొనేలారైతాంగాన్ని శ్రామికుల్ని పల్లెల్లో సిద్ధపరచాలి మరనాగలి-కర్రనాగలికన్న మంచిదని చెప్పాలి అధునాతన వ్యవసాయదారుల వలనే అధిక ఆహారోత్పత్తిల్ని సాధించగలం- రైతాంగం- ఆధునిక వ్యవసాయక పద్ధతుల్ని తెలిసికోవాలి-యంత్రాల్ని వాడటం ట్రాక్టర్లను నడపటం రావాలి వ్వవసాయం పరిశ్రమగా వర్ధిల్లాలి

గ్రామీణ విద్యుద్దీకరణ ప్రభుత్వం చేస్తుంది అయితే గ్రామపంచాయితి ఖర్చుల్ని భరిస్తూ దీనిని కొనసాగించుకొవాలి విద్యుత్ సరఫరా- ఉత్పత్తినేడు చాలినంతగా లేదు ఇందుకు సాంప్రదాయక ఇందన వనరుల ద్వారా పల్లెల్లో విద్యుత్‌ను ఉత్పత్తి చేసికోవాలి బయోగాస్‌టెక్నిక్-గాలి-మరలవినియోగం లోనికి తెచ్చుకోవాలి

ప్రవృత్తికి విరుద్ధమైన వృత్తి ప్రాణసంకటం

కర్మాణి ప్రవిభక్తాని - స్వభావ ప్రభవైర్గుణై

(భ.గీ.-18-41)

# రక్షిత మంచినీటి పథకం-ప్రతి పల్లెకు ప్రాణరక్ష

పల్లెభారతికి అందుబాటులో చెరువులు లేదా సెలయేర్లు ఉంటూ మంచి నీటిని తాగునీరును అందిస్తాయి లేదా నూతులు ఉప్పు నీటిని తాగడానికి అందిస్తాయి చెరువులు నూతులునిత్యం-నిలువనీటితోనుంటూ-అనారోగ్యాల్ని తెచ్చిపెడతాయి ప్రవహించే సెలయేర్లు వరదలు వానలొచ్చిన బురదనీటిని ఇస్తాయి

నివసిస్తున్నపల్లె గృహాలకు ఎతెదూరంగానున్ననూతులు-చెరువుల నుండి గ్రామీణమహిళలు-బిందెల్నిమోసుకొని ప్రతిదినం తెచ్చుకోవడం-నిత్యమై పొందిన జీవితంలో ఒక ముఖ్యమైన కష్ట సాధ్యంతో కూడిన పనిగా ఉంటుంది

పల్లెవాసులు నీటిని భద్రత అవిద్య అజ్ఞానం అశాస్త్రీయంవలన పట్టించుకోరు ఒక పక్క-పశువుల్ని జంతువుల్ని చెరువుల్లో దింపుతూ వేరొక పక్క పల్లెవాసులుస్నానంచెయ్యడం- ఆ నీటిని వాడటం చేస్తారు మంచినీటి బావుల్లో నీటిశుద్ధి-మందును వాడటం వారికి తెలియని విద్య

ప్రజారోగ్యం- ఇలా భ్రష్టపట్టి పల్లెవాసులు నిత్యరోగగ్రస్తులై నిలుస్తుంటారు కనీసం వారికి మంచి నీటి సదుపాయం కల్పించడం సంక్షేమ రాజ్యానికి ప్రథమ కర్తవ్యం ప్రభుత్వం-అందువల్ల-పంచాయితీరాజ్ ద్వారా ప్రతిపల్లెలో రక్షిత- మంచినీటిపథకంఅమలుచేయుటకుపడుతున్నది బోర్‌వెల్సును తీయనున్నది తాగునీటి సదుపాయం ప్రతిపల్లెకు కల్పించాలి

రాష్ట్రంలో గల 60వేల గ్రామాలకు మనం రక్షిత మంచినీటి పథకాల్ని అమలు పరచుకోవాలన్న కేవలం ప్రభుత్వం వలనే ఇదిసాధ్యపడదు- ప్రజల శ్రమ శక్తి శ్రమదానం ఇందుకు తోడ్పడాలి దాతల విరాళాలు కూడా ఇందుకు ఉపకరించాలి పల్లెల్లో గల యువజన బృందాలు స్వచ్ఛంద సేవాసంస్థలు - ఐక్యమైన బోర్‌వెల్స్‌ను రక్షిత మంచినీటి పథకమును అతి స్వల్పఖర్చులతో నిర్మించుకోగలరు

**ఆయురారోగ్యాలే - ఐశ్వర్య దాయకాలు**

**ఆయు సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధన**

(భగ 17 8)

# పరిమిత కుటుంబం - పసందైన కుటుంబం

చిన్నకుటుంబం చింతలు లేని కుటుంబం- వ్యక్తి సంక్షేమం కుటుంబం సంక్షేమము బట్టి ఉంటుంది సమాజ సంక్షేమానికిది ముఖ్యకేంద్రం- ప్రాచీన కాలమున ప్రతి ఒకరు వ్యవసాయకరంగంలోనే తప్ప ఆనాడు పారి శ్రామిక రంగం అంతగా విస్తరించలేదు ఇందువలన- ఉమ్మడి కుటుంబాలు అభివృద్ధిచెందాయి వ్యవసాయంలోకి- మంది మార్బలంకావాలి ఉందులో ప్రాచీన పద్ధతులకు చెందినది సాగుబడి వ్యవసాయం

తదుపరి పారిశ్రామిక విప్లవం వచ్చింది కుటుంబ మంతా ఒకేచోట నివసించటానికి అవకాశము లేదు ఎచట జీవన భృతి లభిస్తే- అచటకు వెళ్ళటమే తప్పని పరిస్థితి- వ్యక్తిగత కుటుంబాలంతరించాయి భార్య- భర్త పిల్లలు కుటుంబం మంది తక్కువైన మజిగ చిక్కగా లభిస్తుంది అపుత్రస్యగతిర్నాస్తి అని పుత్రసంతానం ఆడపిల్ల ఇంటికి లక్ష్మి అని - పుత్రిక జననం తదుపరి- ఎందరోపిల్లలు జనించినను నారు పోసినవారు నీరుపోయడా అని అపరిమిత సంతానానికి ఆహ్వానం

ప్రాచీనకాలమున సంతానం వలన తల్లి దండ్రులు- ఆర్థికంగా వారు తమ వృత్తులలో పనిపాట్లలో సహకరిస్తు వస్తున్నందున ఎంతో లాభించేవారు నేటి యుగమున - ఏవృత్తివారి పిల్లలు ఆవృత్తిలోకొన సాగటానికి వీలులేదు- జీవన భృతికి అనేక జీవన తెరగుల్ని సంపాందించుకోవాలి- ఇందుకు విద్యాబుద్ధుల్ని గడించాలి ఇందుకు తల్లిదండ్రులు తమ బిడ్డలకు పెద్ద చదువులు చెప్పించాలి - తగిన జీవనస్థాయిలో వారినిపెంచాలి

అధిక సంతానంగల తల్లిదండ్రులు అవస్థలు వర్ణనాతీతం అదే పరిమితమైన- కుటుంబం అయినచో తగిన రీతిని వారి సంతానానికి తగిన విధంగా తగిన హోదాస్థితి గతుల్ని కల్పించగలరు ఇందువలన వ్యక్తి గత సంక్షేమమే గాక దేశసమస్య తీరుతుంది అధిక జనాభావల్ల అనేక అనర్థాలు అవతరిస్తాయి

సమాజ హిత కార్య మొనరించుట నీ ప్రథమ కర్తవ్యం

లోక సంగ్రహమే వాపి - సంపశ్యన్ - కర్తుమర్హసి

(భగ 3 20)

# పల్లెల దుస్థితి నివారణకు-' అక్షరం' -అనివార్యం

పెప్పుదేసివాడు పెంతపకుప్ప ఆ తెలుగు-కేంద్ర ప్రభుత్వం తన 50 ఏండ్ల పాలనలో దేశంలో-నిర్బంధ విద్యావిధానమును అమలు పరచలేదు మన రాజ్యాంగ నిర్మాతలు రాతలు పక్షి రాతలుగానే మిగిలి పోయినవి పెవ ప రాష్ట్రాల పరిధిలోనికి తెచ్చారు రాష్ట్రప్రజల్ని విద్యావంతులుగా తీర్చి దిద్దవలసిన బాధ్యత-లున్న రాష్ట్ర ప్రభుత్వానిదే ప్రతిపల్లెలో ఒక ప్రాథమిక పాఠశాల వెలసింది అచటచట హైస్కూళ్ళను తెరచారు

అయితే కొంత ఆర్థిక సత్తువ ఉన్నవారు చదువు-విజ్ఞానం విలువను తెలిసిన వారే తమ పిల్లల్ని బడులకు పంపిస్తువచ్చారు బడుగ బలహీన ప్రజలు పాఠశాలలకు దూరముగానే ఉన్నారు ప్రభుత్వం ఉచితవిద్యా-వేతనాల్ని-కల్పించడంవలన హరిజన గిరిజన వెనుకబడిన తరగతులలో కొంత కదలిక వచ్చింది బడులకు పిల్లల్ని పంపిస్తున్నారు పల్లెలబడుల్ని తెరచిన-హైస్కూల్సు వెలసిన రాష్ట్రంలో అక్షరాస్యుల సంఖ్య 30% మించలేదు నిరక్షరాస్యులు పెరుగుతూవచ్చారు అధిక జనాభా వల్ల ఆశించిన విద్యా ప్రమాణాలు విద్యార్థుల సంఖ్య పెరగలేదు

కష్టజీవన వసతుల్ని లేనివారు తమ పిల్లల్ని చదివించటానికి వీలుగా మధ్యాహ్న భోజన పథకాల్ని ప్రభుత్వం ప్రవేశపెట్టి మరల ఉపసంహరించు కొన్నారు ఉచితరాగు చొక్కాల్ని- ఉచిత పాఠ్య గ్రంథాలనిస్తు వచ్చారు అత్యల్ప స్వల్పాదాయ వర్గాల వారి పిల్లలు అంతంత మాత్రమే-పాఠశాల విద్యను అభ్యసిస్తునారు

పల్లెల్లో నిరక్షరాస్యత సంఖ్యను కుదించటానికి-నిరక్షరాస్యత నిర్మూలనకు రాత్రి బడుల్ని తెరిచారు వయోజన విద్యను ప్రవేశపెట్టారు నాన్ ఫార్మల్ విద్యావిధానం వచ్చింది ఇందువలన సరియైన ఫలితాలు వస్తున్నాయి అక్షర జ్యోతి కార్యక్రమం అమలు పరుస్తు పల్లె ప్రజల్లో విద్యావ్యాప్తిని గావిస్తున్నారు

**నీ ప్రగతికి-పతనానికి-ప్రాతిపదిక-నీ ఆత్మే**

**'' ఉద్ధరేదాత్మనాత్మానాం'** **(భ గీ-6-5)**

# గ్రామీణ-మహిళా సంక్షేమం

కాయ కష్టానికి దూరంగా ఇంట్లో వంటా వార్పు చేస్తూ-తన సంతానాన్ని తన భర్తను తీర్చి దిద్దు కొనేదే గ్రామీణ మహిళ-అనేది మన భావన అయిన పొలం పనులలో- కాయ కష్టంతో నిత్యం మునిగి తేలెతూ ఉంటుంది మగవాడొనరిస్తున్న ప్రతి వ్యవసాయకపనుల్ని ఆడది పల్లెల్లో చేస్తుంది ఇంట్లో పనితోపాటు-బయట తన మగనికి అన్ని విధాలా తోడుగా నిలుస్తుంది

నిన్న మొన్నటివరకు మహిళలకు విద్య అన్న చదువు సంధ్యలన్న పల్లెల్లో నవ్వి ఉపహాస్యం చేసేవారు-నేటికి మారు మూల పల్లెల్లో ఇటువంటివారు ఉన్నారు ఆడది ఉద్యోగం చేస్తుందా! ఊళ్లేలుతుందా వంట ఇంటికుండేయిగా పడి ఉండవలసినదే- ఇది మెజారిటి గ్రామీణుల దురభి పాయం పూర్వీకులు కూడ నస్త్రీ స్వాతంత్ర మర్హసి అన్నారు చిన్న తనంలో తల్లి దండ్రులు వయసొచ్చిన తదుపరి భర్త-వార్థక్యమున-తన సంతానం తనకు తోడని మన పెద్దలు చెప్పారు స్త్రీబద్ధిః ప్రళయాంతకః - అని దూషించారు

మగవాని చేతిలో స్త్రీ ఒక ఆట బొమ్మగ నిలవాలే తప్ప స్వతంత్రతను కలిగి ఉండరాదన్నది తెలుస్తూనే ఉంది ఆధునిక సమాజంలో అతివలు-మగవారికి మేమేమి తక్కువ కాదని అన్నిరంగాల్లో నేడు నిలచి నిరూపిస్తున్నారు ఇంతి మనసొల్లా సస్రవంతిగాని-బాహ్య క్రీడకు వీలిచ్చు బంతి కాదని పురుషులతో పాటు అన్ని హక్కుల్ని-పొందాలని ఉద్యమిస్తున్నారు కుటుంబ సంక్షేమానికి పునాది మాతృమూర్తి మహిళ తప్ప మగవాడు కానేకాదు

మహిళ సంఘాలు స్త్రీ జనోద్ధరణ-స్త్రీ శక్తి నగరాల్లో తప్ప గ్రామీణ ప్రాంతాల్లో అంతగా వ్యాప్తనందలేదు-దరిమిలా పల్లె ప్రాంతాల్లో మహిళా సంఘాలు పుటుకొస్తున్నాయి స్త్రీవిద్య వ్యాపించింది స్త్రీ విముక్తి సాహిత్యం బాగా వ్యాప్త లోనికి వచ్చింది

**నారాయణుని''అంశమే''నారీలోకం**
**నారీణాం - స్మృతిర్మేధాధృతిక్షమా''**

**(భ గీ-10-34)**

# అధోజగత్ సహోదరులకు-రక్షిత పథకాలు

ప్రభుత్వం పథకాలకు రూపకల్పన చేయ Procted Schemes for SC ST ప్రజలెల్లరిని ఉద్ధరించడంలో ప్రత్యేక తరహా పథకాల్ని అమలు పరచాలి ఒకేవిధమైన పథకాలు ఎల్ల ప్రజానీకానికి ఉపకరించకపోగా - దుష్ఫలితాల్నిస్తాయి

జనరక్షణ పథకాల్ని (up lifting schemes) కేవలం హరిజనులకు గిరిజనులకే కల్పించాలి తరతరాల దుర్భర దారిద్ర్యంతో నలిగినవారు నేటికి వణుకుతూ కునుకుతీస్తూ జీవిస్తున్నారు

నిధుల్ని గరిష్ఠ స్థాయిలో వారికి వెచ్చించాలి-లేనిచో వీరు బ్రతికి బట్ట కట్టి సుఖ పడలేరు నాగరిక జీవితానికి ఎంతో దూరంగా నిలచినవారు గిరిజనులు వారికి రక్షిత సేవా పథకాలు అవసరం అటవిక జాతులకు చెందిన కొండ- కోయ భగత్-కొండదొరలు సృష్ట్యాది నుండి దుర్గమారణ్యంలోనే నివసిస్తున్నారు

అందుండి బయటిపడిననాడు బాహ్య ప్రపంచంలో నిలద్రొక్కుకో గలరు -వీరికి సకల సదుపాయాల్ని ప్రభుత్వం అందించాలి అనాగరిక జాతులకు నాగరిక జీవనం అలవడాలి-సమగ్ర గిరిజనాభివృద్ధి జరగాలి

వసతి కూడు గుడ్డ అన్నింటిని సమకూర్చి వారి జీవన విధానమునకు అడ్డురాని జనజీవన సంస్కృతిలో వీరిని చేర్పించ గలగాలి రవాణా వార్తా ప్రసార సౌకర్యాల్ని కల్పించి మైదానం ప్రాంతాలతో వారిని మమైకం చేయాలి-అటవిక ఉత్పత్తుల మద్దతు ధరల్ని ప్రకటించాలి

వీరితోపాటు సామాజిక న్యాయానికి ఊరికి దూరంగా జీవిస్తున్న హరిజనులకు సరి సమానవకాశాలివ్వాలి సాటి సోదరులని భావించాలి-అస్పృశ్యులని వారిని వెలివేసిన ఒకనాటి సమాజం సిగ్గు పడేలా వీరిని అభ్యుదయ అభివృద్ధి పథంలో నడిపించాలి ఇందుకు వీరికి రక్షిత పథకాలే అవసరం

**వృత్తి నైపుణ్యం - సామర్థ్యం - పెట్టుబడులు సమకూర్చాలి '**
**సరి సమాన హోదా సాంఘిక - గౌరవములను అందించాలి**

# వెనుకబడిన తరగతుల-సంక్షేమ పథకాలు

## (Welfare Schemes for Backward Classess)

సాంఘికంగా విద్యాపరంగా వెనుకబడినవారు-సంఘబహిష్కృతులుగా పిలిచిన వారి కన్న వీరి జీవితాలు కొంచెం మెరుగ గనే ఉంటాయి-అందుకు వీరికి వీరి వెనుకబడిన తనము నివారించ-కొన్న సాంఘిక సంక్షేమ పథకాల్ని అమలు పరచాలి

శ్రేయోరాజ్యంలో జన సంక్షేమ పథకాలు తప్పని సరి రాజ్యాంగంలోని ఆదేశ సూత్రాల మేరకు-సుప్రీంకోర్టు తీర్పుననుసరించి-వెనుకబడిన తరగతుల వారికి అన్నింటిలో రిజర్వేషన్లు సదుపాయాల్ని కల్పించాలి

నివాశస్థలాల మంజూరులో ఇండ్ల నిర్మాణంలో అల్పాదాయ వర్గాలకు చెందిన వెనుక బడిన తరగతుల వారికి ప్రాధాన్యత నివ్వాలి సన్న చిన్న కారు రైతాంగం-సుమారు 85% ఈ వర్గాలకు చెందిన వారుగనే ఉంటారు

ప్రతి పల్లెలో నేడు హరిజన గిరిజన-కాలనిలకు దీటుగ బి సి( బలహీన వర్గాల) కోలనిలు నిర్మించ బడుతున్నవి ఈ కోలనీలలో హెచ్చుగా పల్లెల్లో-రైతుకూలీలగా-అల్పాదాయవర్గాల వారిగనే ఉంటారు సాంప్రదాయక వృత్తల వారుగనే ఉంటారు బ్యాంకులు-ప్రభుత్వం-వీరికి ఋణ సదుపాయాల్ని- ఉపాది అవకాశాల్ని కలుగజేయాలి చేనేత పనివారిని గంగపుత్రుల్ని రజకులు నాయీబ్రాహ్మణ కమ్మరి-కుమ్మరి-వడ్రంగి ఇతరులు ఈకోలనీలోనే ఉంటారు

వ్యవసాయ కూలీలకు దినసరి వేతనాల్ని పెంచాలి సన్న చిన్న కారు రైతాంగానికి-సబ్సిడి పై ఎరువులు విత్తనాలు పురుగుమందులు సప్లయి చేయాలి భౌతిక ఉత్పత్తుల పనివారికి బ్యాంకింగ్ ఋణసదుపాయాల్ని అందజేయాలి వీరి పిల్లలకు విద్యా సంస్థలో అవకాశాల్ని కల్పించి ఉపకారవేతనముల్ని మంజూరు చేయాలి

**సాంఘికన్యాయం - సంఘప్రయోజనం సిద్ధించాలి**

**వెనుకబడిన వర్గాల వారిలో వెలుగు -జనించాలి**

# బలహీన వర్గాలకు-సేవా పథకాలు
## (Service Schemes for weaker Sections

షెడ్యూల్డ్ తెగలు షెడ్యూల్ జాతులు హరిజనులు దళితులుగా పిలవబడుతారు అధోజగత్ సహోదరులు వీరినుద్ధరించ రక్షిత పథకాలు వెనుకబడిన తరగతులు ఎడుగు జనులుగా పిలవబడతారు వీరిని కాపాడేవి సంక్షేమ పథకాలు ఈ ఇరుతెగలకు చెందని బలహీనవర్గాలవారుంటారు వీరి జీవన వెసులు బాటునకు సేవాపథకాలు(service schemes)

ప్రభుత్వం సమాజమునగల ఈ మూడు తరగతులకు చెందిన ప్రజలు సుఖ శాంతులతో జీవితం గడపాలన్న మూడు విధానాలకు చెందిన పథకాల్ని ప్రవేశపెట్టి అమలు పరచాలి

1 రక్షిత పథకాలు SC ST

2 సంక్షేమ పథకాలు- BC

3 సేవా పథకాలు - OC

ఒకరు పేదవారు వేరొకరు వెనుకబడినవారు-మరొకరు బలహీనులు-ముగ్గురిని మూడు విధాలుగా ప్రభుత్వం చేయూత నివ్వాలి-లేనిచో సమాజము సమతూకం చెడుతుంది పక్షపాతం నిలుస్తుంది

ఒకరికి ఉనికే ఉండదు మరొకరికి మనుగడ ఉండదు వేరొకరికి వికాసన అనేది లేదు అందుకు ప్రభుత్వం ఉనికిని కలిగి లేని వ్యక్తులకు ప్రొటెక్టెడ్ స్కీము మనుగడనందని వృత్తులకు-వెల్ఫేర్ స్కీము వికాసన వికసించ సేవా పథకాలు అమలు పరచాలి

నిస్సహాయ నిర్ధనికులు అయిన అగ్ర వర్ణాల వారు వితంతువులు వృద్ధులు అంగవైకల్యం కలవారు-స్త్రీలు పిల్లలు ఎల్లరు-ప్రభుత్వం కల్పించగల సేవా పథకాల వలన లాభపడగల వారిగనే ఉండాలి

**జీవనసుస్థిరతకు సేవాపథకాల్ని అమలు పరచాలి '**

**బలహీన వర్గాల - వారెవరైనా - బాగుపడాలి**

# అల్ప సంఖ్యాకుల- హక్కుల- రక్షణ

**(ముస్లింలు- క్రైస్తవులు)**

ఏ రాష్ట్రంలోను ఒకే తరగతికి చెందిన వారు ఉండరు విభిన్న కుల మత వర్గ వర్ణముల వారుంటారు మన రాజ్యాంగం- కేవలం అల్ప సంఖ్యాక వర్గం వారికే ప్రతేకమ్మైన- హక్కు ల రక్షణ చట్టం అనుమతించింది

కుల- మత- వర్ణం- వీటికి అతీతమ్మైనిది మన ప్రభుత్వం- మనది- లౌకిక వాదు Secularisam) మనరాజ్యాంగు వీటికిఅతీతమ్మైనది మనదిమతాతీత లౌకిక పాలన

ఒయితే భారత్‌లో- అసంఖ్యాక హిందువులతో పాటు- అల్పసాంఖ్యాక వర్గాలకు చెందిన ముస్లింలు- క్రైస్తవులు ఉన్నారు ప్రజాస్వామ్యము అధిక సంఖ్యాకి వర్గాలవారిదే- ప్రభుత్వం- మెజారీటీ ని ఒట్టి ఏర్పడుతుంది కదా!

అల్పసంఖ్యాక వరాలవారి హక్కుల్ని రక్షించబడిన కాని వారు సమాజమున సుఖ శాంతుల్ని కలిగిన జీవన విధానమున కలిగి ఉండలేరు- వారి భాషకు వారి సంస్కృతికి- వారి ఆచార సాంప్రదాయాల్ని- రక్షించుకొనే హక్కును మన రాజ్యాంగం- వారికి ప్రసాదించింది

ముస్లింలకు ప్రత్యేకమ్మైన విద్యాలయాలు ఎర్పడుతాయి వారి విశ్వాస నమ్మికల రక్షనకు వక్ఫ్‌బోర్డు ఒకటి ఏర్పడింది వారి భాషకు- [illegible] ష్టంలో రెండవ రాజభాషగా గుర్తించె పరిస్థితి ఉంది క్రైస్తవులు కూడ [illegible] రిజర్వేషన్లు- పొందుచున్నారు [illegible] విద్యాలయాల్ని వీరి [illegible] నే అవకాశం - స్వేచ్ఛ వారికిచ్చారు వీరి [illegible] [illegible] అంటాడు [illegible] [illegible] సహోదరత్వం [illegible] [illegible] అవకాశమిచ్చారాడు మన [illegible] [illegible] రాష్ట్రాలలో [illegible] రాష్ట్రా [illegible] ఒక భాషకు చెందిన రాష్ట్రం వారు వేరొక భాషా రాష్ట్రానికి చెందినవారు మైనారిటీ వర్గాల వారిగా నిలుస్తారు

**'అందరిపట్ల -మైత్రభావంతో మనం మెలగాలి**

**''అద్వేష్టాసర్వభూతానాం - మైత్రి కరుణ ఏవచ**

**(భ గీ 12 13)**

## అధికారిక వ్యవస్థ- ప్రజాప్రతినిధులు
## పాలనావ్యవస్థ- ప్రభుత్వోద్యోగులు

పాలించెవారు అధికారులు అధికారులె పాలించే వారని అందరికి తెలిసిన అర్థం అయితె అధికార వ్యవస్థ పాలనా వ్యవస్థ వేర్వేరుగా నుంటూ మరల ఒకే రూపమున అంతరించుకుంటూ ప్రభుత్వముగా పరిగణించబడతాయి అధికారవిభజన జరిగింది కార్య నిర్వాహక వర్గం న్యాయశాఖ శాసన నిర్మాణ శాఖ అందుకె మన దేశం ప్రజాస్వామిక దేశం ఒకరు నిరంకుశాధికారులుగా మెలగేరు అధికారాల పంపిణి జరిగింది కేంద్రంలో కార్యనిర్వహణాధికారి రాష్ట్రపతి రాష్ట్రంలో గవర్నర్ జిల్లాలో కలెక్టర్ మండలంలో రామసాయిలో విలేజ్ డెవలప్మెంట్ ఆఫీసర్

వీరెల్లరు మన పాలనా వ్యవస్థకు చెందిన వారు తప్ప అధికార వ్యవస్థకు చెందిన వారు కాదు కేంద్రంలో శాసన నిర్మాణాధికారి ప్రధానమంత్రి- రాష్ట్రంలో ముఖ్యమంత్రి జిల్లాలో అభివృద్ధి స్థాయీ సంఘం మండలంలో మండల ప్రెసిడెంట్ గ్రామ స్థాయిలో గ్రామ సర్పంచ్ అధికార వ్యవస్థకు చెందిన వారు

వారైన వీరైన ఎవరైన మన రాజ్యాంగంలో నిక్షిప్తపడిన పాలనానియమం (Rule of law) మేరకె వ్యవహరించాలి ఒకరు ఏస్థాయిలోను సర్వాధి కారులుగా నిలవరు చివరిగా సార్వభౌమాధి కారం ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధుల సభలకే పరిమితం ప్రజాక్షేమం- ఉమ్మడి ప్రయోజనం- అధికారవ్యవస్థ పాలనావ్యవస్థ ముఖ్య లక్షణాలు

పాలనా వ్యవస్థ లో ఉన్నవారు ఉద్యోగులనిఎంచుకుంటారు- అధికార వ్యవస్థలో ఉన్నవారు ప్రజా ప్రతినిధులనిఎంచుకొంటారు పాలనా వ్యవస్థ(యంత్రాంగం) పరమావధి ప్రజాక్షేమమే తప్ప వరాలు వ్యక్తుల ప్రయోజనంకాదు త్యాగశీలత నిస్వార్థం బాధ్యతల నిర్వహణ పరి శుద్ధ పాలనకు ప్రతీకలు అధికార వ్యవస్థకు - ఆరవ ప్రాణం

**అదుపు ఆజ్ఞల నిడగలది - అధికార వ్యవస్థ**
**లోకువ లొంగుబాటుల్ని అందగలది పాలనా వ్యవస్థ'**

## ... వ్యక్తి ... సమన్వయం-శాంతి

... ఒక దానితో ఒకటి విభేదించిన అంశాంతి వ్యవసాయక ... పల్లెల్లో ... కన్పించేది రైతాంగమే పొలాల్లో పని చేసే రైతు కూలీలు కర్షకులు ఈ ఇరువరి మధ్య సమన్వయం సాధించబడిన ... సంపూర్ణ గ్రామీణ వికాసం ఇరువురు ఘర్షణ పడిన సంభవించు ... గ్రామీణ వినాశనం

వ్యవసాయకోత్పత్తులపై ఆధారపడి జీవించే ఈ ద్వివిధ వర్గాలవారు పరస్పర విరుద్ధ ప్రయోజనాల్ని ఆశిస్తారు సమిష్టి ప్రయోజనంగాక స్వంత ప్రయోజనాల పరిధిలో వ్యవహరిస్తారు

యాజమాన్యపు శక్తులుగా రైతులు నిలిస్తే ఉత్పత్తి శక్తులుగా కూలీలు అవతరిస్తారు న్యాయమైన పనికి న్యాయమైన కూలి రేటు కావాలన్నది కూలీల వాదం గిరాకి నష్టమేరకే కూలిరేట్లనిస్తామన్నది రైతులవాదం

సన్నచిన్నకారు రైతాంగం గల మన పల్లెల్లో ఈ ఇరువర్గాల వారి మధ్య సంఘర్షణలు తలెత్తే అవకాశంలేదు కారణం- ఈసన్న చిన్నకారు రైతాంగం జీవనస్థాయి ఈ కూలీల జీవనస్థాయికి అంతకుమించినదేమీ కాదు అవసరమైన రైతులే ఉత్పత్తి శక్తులుగా మారి కూలిపనుల్ని ఎవరికివారే ... - కొంటారు

... ప్రాంతాల్లో పొలాల్లో పనిచేసే రైతుకూలీలు- ఇచ్చినంత పుచ్చుకొని ... శ్రమను రైతాంగానికి ధారపోయిక తప్పని స్థితిగతుల్ని కలిగి ఉంటారు ఇరువురికి ప్రధాన జీవనరంగం వ్యవసాయమే

ఇక పల్లెలో కార్మికులు యజమానులుంటారని గాక లఘు పరిశ్రమలు చేతి వృత్తులు గృహపరిశ్రమలున్న పల్లెల్లో ఎవరు కార్మికుడు ఎవరు యజమాని అన్నది తెలియని పరిస్థితి ఘర్షణకు అవకాశమే లేదు

**పల్లె సమైక్య పడిన - గ్రామీణ వికాసం**
**పల్లె సంఘర్షణ పడిన- గ్రామీణ వినాశనం**

# అనిశ్చిత ఆదాయవర్గాల - సాంఘిక భద్రత

సాంఘిక భద్రతను కరువైన వ్యక్తుల జీవితాలు ఏకరుంచవు-వంట్లో శక్తియుక్తలున్నంతవరకు నిత్యం శమించిన వ్యక్తి ఇది సన్నగిల్లిన తదుపరి తనకు సహాయపడేదెవరు

ప్రాచీనులు కష్టకాలాన తమ జీవితం చివరి దశలో వారిని ఆదుకొనేది వారి సంతానమె అని భావించేవారు ఇచట వారిని ఆదుకొవడం అన వారికి గతిని కలించేవారు గలిగలిగిన స్థితెవరన తన మతి ఏకరుస్తుంది

ఆధునిక ప్రపంచాన వారిశ్రామిక వ్యవస్థలో ఎవరి సంతానం వారి వద్దనే మనుగడ సాగించవలసిన పరిస్థితులు లేవు తల్లి దండ్రులు బిడ్డలు వేరు కావలసిందె వేర్పేరు చోటులో ఉండవలసిందే

ఇంతేకాదు వ్యక్తులలో ఆత్మాభిమానం స్వతంత్ర ప్రతిపత్తి వ్యక్తిత్వం-అహంభావం (Ego) అతిగా నేడు ప్రస్ఫుటపడుచున్నది ఎవరికి వారే ఉద్దరించబడాలి-వేరొకరు ఉద్దరించె పరిస్థితినెడు లెదు

ప్రభుత్వంలో పనిచేసిన వ్యక్తులకు పదవీవిరమణ తదనంతరం-నెలవారి పెన్షన్ వారి జీవితానికి భద్రతగా నిలుస్తుంది పరిశ్రమల్లో పనిచేసిన వారికి ప్రావిడెంట్‌ఫండ్ చట్టం వలన పదవీ విరమణానంతరం పెన్షన్ బెనిఫిట్స్ పొందుతున్నారు

గ్రామీణ ప్రాంతాల్లోనున్న వారెల్ల సన్న-చిన్నకారు రైతాంగం గృహవృత్తులు వారు సాంప్రదాయక పనులలో నిత్యం మునిగితేలిన వారు దిన వారీ కూలీపై జీవితం కొనసాగిస్తూ కాలాన్ని వెళ్ళిస్తున్నారు శరీరంలో సత్తువ సన్నగిల్లినదే తడువు వీరెల్లరు రోజు వారీ ఆదాయం లేక దుర్భరి జీవితాన్ని గడపాలి తన సంతానం-సద్గతి అదిలేకున్న దుర్గతి

అందుకు అల్పాదాయ స్వల్పాదాయ వర్గాల వారికి ప్రభుత్వమే ఉచ్చిత సాంఘిక భద్రత - ఉచిత భీమాసౌకర్యం కల్పించాలి

**సాంప్రదాయక వృత్తుల వారికి సాంఘిక భద్రత కల్పించాలి '**

**వ్యవసాయ కూలిలకు న్యాయమైన వేతనం ...**

# వయోవృద్ధులకు-వికలాంగులకు జనతా పెన్షన్ విధానం

ప్రతి ఒక్కరికి ఉచిత జీవన స్థితిగతులను-కలిగించ ... అది అర్థ శాస్త్రరీత్యా అసాధ్యం- ఎవరి ప్రతిభాసామర్థ్యాలు ... జీవించడానికి తగిన అవకాశాల్ని ఏర్పరుస్తూ-వారి అవసరాల్ని - ... వ్యక్తుల పై రకు ప్రభుత్వం తీర్చగలుగుతుంది

కాయ కష్టంతో జీవించినంతకాలం-గ్రామీణ యువతీయువకులు తమ కష్టార్జితముతో తమ జీవితాల్ని గడపగలరు ఇక కాలు చేయి కలిసిరానపుడు వార్ధక్యం-త... మీద పడినపుడు తనొకమూలన చేరవలసిందే తప్ప అంతకుమించి గత్యంతరం లేదు తన ఇల్లు తన కాలు చేతికి అందివస్తారన్నది పాత మాటగా నిలుస్తుంది

అనిశ్చిత అల్పాదాయ స్వల్పాదాయ వర్గాలవారికి చెందిన వయోవృద్ధులు- అంగవైకల్యంకలిగినవారు-సమాజానికి గతంలో వారు చేసిన సేవలకు ప్రతిఫల - ముగ, వారికి ప్రభుత్వంనుండి కనీస జీవన భృతి అందాలి

పల్లెల్లో ఇటువంటి వారికి 60 ఏండ్లు దాటిన అనిశ్చిత ... వర్గాల వారిని లెక్కించి- ఎల్లరికి-జీవనభృతి (పెన్షన్) అంతో ఇంతో ... ంచాలి- ఈ దశలో వారు చేయగల పనుల్ని వారికి అప్పగించి- ... ఏలో ... విశ్వాసాల్ని ఏర్పరచి-వారి జీవితంలో కొత్త వెలుగుల్ని నింపాలి

గ్రామ స్థాయిలో ఇటువంటి వారికి ఒక ... దము ఏర్పరచి-గృహ పృత్తులు చేతివృత్తులు-సాంప్రదాయక వృత్తులు ఏదైనా ఒక వృత్తిలో కొనసాగేటట్లు చేసి వీరికి వారొనరించిన శ్రమ ఫలితమును అందించాలి

1) ముసలితనం-వ్యాధి-నిరంతర దుఃఖ దర్శనాలు

2) జన్మ మృత్యుజరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్

(భ గీ 13 8)

# పల్లెల్లో సామాజిక-సామూహిక మరుగుదొడ్ల నిర్మాణం

గ్రామీణ జీవితంలో వ్యక్తుల ఆహారవిహారాలు నియమాలు-క్రమబద్ధముగా ఉండవు- ఎల్లరుస్నానమొనరించేది ఇంట్లో కాదు-వీధి నూతుల వద్ద- ఊరుప్రక్క పారే సెలయేర్లలో-తన ప్రక్కనున్న చెరువుల్లో-భోజనం మాత్రం గోప్యంగా ఏ ఒకరికి తెలియనిరీతిని-తలుపు చాటున - ఇంటిలో జరుపుతారు

పాశ్చాత్యులు స్నానం చేసేది స్నానపు గదుల్లో- భోజనం చేసేది బహిరం - గంగా నలుగురిలో కలిసి-పల్లె భారతి-మలమూత్రవిసర్జన చేసేది-పదిమంది - నడిచే మార్గంలో-లేదా తను నివసించేస్థలాల దరిదాపుల్లో లేదా విశాల బహిరంగ ప్రదేశాలలో-తప్ప ఇందుకు ప్రత్యేకంగా లెట్రిన్స్- ఏర్పాటు అనేది పల్లె జీవితంలో లేనే లేదు

ఇక వ్యవసాయక రంగంలో-పల్లెభారతి- నిత్యం తలమానికంగా విశాల మైదానం భూముల్లో నిత్యం రైతులు- కూలీలు- కాలకృత్యాల్ని తీర్చుకోవటానికి ఒకే ప్రదేశంలోనే కట్టుబడాలన్నది లేకపోయింది అందుకు ఈ విషయంలో వారెల్లరు అక్రమ పద్ధతికి-అలవాటు పడ్డారు

జనాభా విస్తరించడంతో పాటు-పల్లెల్లో నివాసస్థలాలు ఒత్తిడి పెరిగింది నగరాల స్థాయికి జనాభావిషయంలో చేరుతుంటున్నాయి వేలకొలది ప్రజానీకం నేడు పల్లెల్లోనే జీవిస్తునారు విశాలప్రదేశాలున్ననేడు ఏదో వ్యవసాయ కోత్పత్తుతో నిండిపోతూనే ఉన్నాయి అందకు కాలకృత్యాల్ని తీర్చుకోవడం మునపటి వలే సాధ్యంకాదు- పల్లెల్లో అధికాదాయ వర్గాలవారు, ఇప్పుడిప్పుడే స్వంతమరుగు దొడ్లను నిర్మించు కొంటున్నారు. పల్లెల్లో నేడు సామాజిక - సామూహిక మరుగు దొడ్లు - అనివార్యం చాలా అవసరం

**"ఉమ్మడి ఆరోగ్య పథకం - ఊరందరికీ మేలు"**

**"పరిసరాల - శుభ్రతే - పల్లెకు ఆరోగ్యం"**

# ప్రజల వద్దకు పాలన - గ్రామ స్వరాజ్యసాధన

పాలకులు పాలితులు అన్న విభాగం గత ప్రాచీన రాజకీయ వరి తకు చెందినది నేటి ప్రజాస్వామ్య యుగమున- ఉన్నది పౌరులు ప్రజా ప్రతినిధులు పౌరులు ప్రజా ప్రతినిధులు పరిపాలనలో భాగస్వాములే ఉండాలి నేటిమన రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రజలముంగిటకు ప్రభుత్వం అన్న విధానమును అటునుండి ఇటువైపుకు ముఖ్యప్రతిష్ట ప్రజలవద్దకు పాలన అన్నదెర్వ రచాడు ప్రభుత్వంనుండి ప్రజలు వేరు పడరు పాలనలో భాగస్వాములు అన్నది కొటీమాటగనే సరిపెట్టిక కార్యాచరణ రూపంలో నేడు విస్తరిస్తున్నది ప్రజల వదకుపాలన పథకం

దశాదిశానిర్దేశం చేస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రజల వద్దకు పాలన విజయవంతం అయ్యేటట్లు నిత్యం శ్రమిస్తున్నారు ప్రజాహిత కార్యక్రమాల్లో నిత్యం నిమగ్నమై తెడుగుతున్నారు

గతమనదేశ మాజీ ప్రధాని ఒకరు! అమలు అవుతున్న-జవహర్ ఇందిరా ఆవాజ్- ప్రధాని-రోజ్‌గార్ యోజనలు- ఐ ఆర్ డి ఎ వంటి పథకాలు పొందుపరే రప్పు- ఇందుకోసంసం వెచ్చిస్తున్న ప్రతి రూపాయిలో లబ్ధిదారునికి దక్కు తున్నది పదిహేను పైసలే అని నిరాశను వ్యక్తపరచారు

ఈదుర్స్థితి దుర్భర అవినీతి కరవిధానాలు- రాజధాని గద్దెలపై కూర్చుని ఆదేశాలిచ్చినంత మాత్రాన అంతంకావు- అందుకుపాలన( పరిపాలనా విభాగం) ప్రజల వద్దకే వెళ్ళి నిలచి- వారిలో కలిసిమెలసి కార్యక్రమాల్ని చక్కబెట్టాలి- దోపిడి దోసగులున్న బయటపడతాయి అవినీతి కరవిధానాలు ఉంతరిస్తాయి

దేశానికి స్వరాజ్యంతో పాటు గ్రామస్వరాజ్యం స్థాపన కావాలి పల్లెలు స్వయం పోషక శక్తులుగా నిలవాలి స్వతంత్రత స్వేచ్ఛ-నిజాయితీ నిర్ణయాల్ని కలిగి ఉండాలి నిరుద్యోగాన్ని పారద్రోలాలి విద్యను విజ్ఞానాన్ని సంపాదించాలి

**పనిలోని -నేర్పరితనమే- యోగం అనబడును**

**యోగ కర్మసు, కౌశలమ్'' (భ గీ 2 53)**

# ముఖ్యమంత్రి - యువశక్తి - ఉపాదిహామీ పథకం

ఎన్నోపథకాలు ప్రజల జీవనస్థాయిని-ఆర్థిక సుస్థిరతను కాపాడటానికి ప్రవేశపెట్టబడినవి- ఇందులో-కేంద్ర- రాష్ట్రస్థాయి ప్రజాపయోగ పథకాలున్నాయి ఇందులోనేడు నూతనంగా ప్రవేశపెడుతున్న గ్రామీణ నిరుద్యోగ నిర్మూలన పథకం-ముఖ్యమంత్రి యువశక్తి-కార్యక్రమం-పేరిట అమలు కాబోతున్నది

నిజానికినేటి గ్రామాల్లో యువకులు-వ్యవసాయ రంగంలో నిలవలేక పారిశ్రామిక రంగంలో-ఉవకాశాలు అందలేక-పరివాలనా రంగంలో-దూరలేక నిస్పృహాయ నిస్పృహ స్థితిలోనే ఉన్నారు

ప్రతిపల్లెలో ఉన్నయువకులకు ఒక ఇంటికి ఒకరికి ఉవకాశమివ్వటానికి ఆ గ్రామంలోనున్న యువకులు కనీసం పది-పదిహేను-మందికి తగ్గకుండా ఒక సోసైటీగా ఎర్పడిన- ఒక్కొక్కరికి ఒక్కొక్క లక్షరూపాయిల్ని అందివేస్తారు దీనిలో వారు స్వయం ఉపాది యూనిట్లను స్థాపించుకోవాలి

ఇందులో 65వేలు సబ్సిడి మరల తీర్చనవసరం లేదు నామమాత్రపు వడ్డీపై 20వేలు 15వేలు లబ్ధిదారులు చెల్లించాలి ఇటువంటివారిని మొదటిగా శిక్షణనిస్తారు వారు యూనిట్లను-నడపగలరన్న నమ్మకం కుదిరితేనే లక్షరూపాయాల్ని విడుదల చేస్తారు

ఇందుకోసం ఈసంవత్సరం 170కోట్లను విడుదల చేస్తారు ఉపాది హామీపథకాలను విధులను ఖర్చుచేయడమే తడువు కేంద్రం-నుంచి మరల నిదుల్ని అందగల అవకాశముంది

ప్రతి ఒక పల్లెలో-అక్షరాస్యులైన-నిరక్షరాస్యులైన యువకులు- ఈ పథకంద్వారా-స్వయం పోషక విధానాల్ని సమకూర్చుకొని-స్వతంత్ర్య జీవనం గడపవచ్చు పల్లె భారతి ప్రగతి పథంలో పయనిస్తుంది

కర్మకు - కర్తవు - కర్మాధికారివి నీవే

' కర్మణ్యేవాధికారస్తే '

(భ గీ.249)

# గ్రామీణ గృహపరిశ్రమలు - సాంప్రదాయక వృత్తులు

ప్రత్యేక పక్షిన- పథమ ఎరిష్టం అత్యధిక జనాభా పల్లెలో లభించు వనరులకు మించి పల్లె జనాభా నేడు పెరుగుతున్నది పల్లె జీవనాధార వనరులు భూమి పంట్లు తోటలు చెరువులు-సమీపఅడవులు ఇవిపెంపొందింప లేదని కావు జనాభా పెరుగుంటెర పల్లెకు దుర్గతి తప్ప ప్రజ కంగదు మరొక ఉపాయకరమైనది కనిపింపని నిరుద్యోగులు-పనిపాట్లను కలిగి ఉన్నవారిగా కన్పిస్తారు నిజానికి వారికి ఏరిపడు ఆదాయం తెచ్చే ఉపాదులు వారికి ఉండవు వ్యవసాయరంగంలో నిజానికి-పాటుపడుతున్నవారు ఇందుకు కావలసిన వారికున్న హెచ్చుతుంది మరో గత్యంతరం లేక ఇంటిల్లవాది తమకున్న ఆస్తితో భూవనరులతో కాలక్షేపం చేస్తారు

అందుకు వ్యవసాయక రంగమునకు అవసరమైన మానవ శ్రమను మించి ఉన్న వారికి ఇతర ఉత్పత్తి రంగాలకు తరలించారు పారిశ్రామిక రంగంలో వారి శక్తి యుక్తులు ఉపయోగపడేలాచూడాలి

సాంప్రదాయక వృత్తులు వారికి వారి వారి వృత్తులలో నైపుణ్యం సామర్థ్యం ఉంటుంది తప్ప వేరేగా వారు మరోలా సమాజానికి ఉపయోగ పడ లేరు పల్లెల్లో అధిక సంఖ్యాకులుగానున్నది వీరే- కమ్మరి- కుమ్మరి- వడ్రంగి రజకులు నాయబ్రాహ్మణ నేతపనివాళ్ళు- వారివారి గృహవృత్తులలో రాణించటానికి అవసరమైన ముడిసరుకుల్ని వినిమయ వస్తూ ఉత్పత్తుల్ని మార్కెట్‌లో అమ్మటానికి తగిన రవాణా వార్తప్రసార సౌకర్యాలు ఏర్పడాలి వరి ఉత్పత్తులకు మద్దతు ధరలు ప్రకటించాలి- గిట్టుబాటు ధరల్ని కల్పించాలి

**విముక్తి (జ్ఞానం) నీ పనితనం (కర్మ) మేరకు నీకు - లభిస్తుంది**
**స్వే - స్వే - కర్మణ్యా భరతః సంసిద్ధిం లభతే నరః**

**(భ గీ 18 45)**